# అధికమాసం-శాస్త్రీయ దృక్పథం, పౌరాణిక దృక్పథం

అధికమాసమనే పేరుతోనే తెలుస్తుంది ఇది అదనంగా వచ్చేమాసమని.మామూలుగా చాంద్రమానం ప్రకారం

ఐనా భారతప్రభుత్వ భారత కాలమానం ప్రకారం ఐనా లేదా ఆంగ్లకాలమానం ప్రకారం ఐనా సంవత్సరానికి

12. నెలలే ఉంటాయనే విషయం తెలిసిందే.ఐతే అధికమాసం వచ్చినప్పుడు చాంద్రమాన సంవత్సరంలో

ఒక మాసం అధికంగా వచ్చి ఆ సంవత్సరం 13 నెలలపాటు ఉంటుంది.దీనిని అధికమాసమనీ,

మలమాసమనీ, పురుషోత్తమమాసమనీ మరియు మలిమ్లుచ్చమనీ కూడా వ్యవహిస్తారు.

అధికమాసం ప్రతి 33 మాసాలకొకసారి వస్తుంది. ఇంకా కచ్చితంగా చెప్పాలంతే వసిష్ఠ సిద్ధాంతం ప్రకారం 32

మాసముల 16 రోజుల 8 ఘడియలకొకసారి అధికమాసం వస్తుంది.అధికమాసం తరువాత వచ్చేపేరే

అధికమాసానికీ ఉంటుంది.ప్రస్తుతం శ్రావణ మాసానికి ముందుగా అధికమాసం వచ్చినందువల్ల దీనిని అధిక

శ్రావణమనే పిలుస్తారు.అధిక శ్రావణం తరువాత నిజ శ్రావణం ప్రారంభమౌతుంది.అధికమాసం ప్రత్యేకత

ఏమిటంటే ఈ మాసంలో సూర్య సంక్రమణ ఉండదు.సూర్య సంక్రమణ జరగని కారణంగానే దీనిని

అధికమాసమని పిలుస్తారు.

సౌరసంవత్సర ప్రమాణం 365 రోజుల 06 నిమిషాలు.అలాగే చాంద్రమాన సంవత్సర ప్రమాణం 354

రోజులు.అంటే ప్రతి సంవత్సరం సౌర వత్సరం కంటే చాంద్ర వత్సరం 11 సంత్సరాల 1 గంట 31

నిమిషాల 12 సెకనులు వెనుకబడి ఉంటున్నది.ఈ భేదం సుమారుగా 3 సంవత్సరాలకు ఒక మాసం వరకు

పెరుగుతుంది.ఇలా ఒక మాసం వరకు పెరిగిన కాలం సుమారు 3 సంవత్సరాల కొకసారి (33

మాసాలకొకసారి) అధికమాసం గా వస్తుంది.

ఈ అధికమాసం చైత్రమాసం నుండి ఆశ్వయుజ మాసం వరకు 7 మాసాలలో ఏదో ఒక మాసంలోనే

వస్తుంది.కాని కార్తీకం నుండి ఫాల్గుణం వరకు మాసాలలో రాదు.భూకక్ష్యలో కొంత భేదం కారణంగా చైత్రమాసం

నుండి ఆశ్వయుజ మాసం వరకు సూర్యసంక్రమణకు పట్టేకాలం స్వల్పంగా 30 రోజులలోపే

ఉంటుంది.అందువల్ల ఈ మాసాలలోనే అధికమాసం వస్తుంది.ఒక మాసంలో వచ్చిన అధికమాసం తిరిగి అదే

మాసంలో 16 సంవత్సరాలకు వస్తుంది.గతంలో అంటే 2020 లో ఆశ్వయుజ మాసంలో అధికమాసం

వచ్చింది.మళ్ళీ ఆశ్వయుజ మాసం అధికమాసంగా 2039 లో వస్తుంది.

అధికమాసం వచ్చినట్లే క్షయమాసం కూడా వస్తుంది.క్షయమాసం వచ్చినప్పుడు చాంద్ర సంవత్సరం 11

నెలలకు తగ్గుతుంది.క్షయమాస ప్రత్యేకత ఏమిటంటే ఈ మాసంలో సూర్య సంక్రమణ రెండు మార్లు

జరుగుతుంది.

శ్లో॥ఏకస్మిన్వత్సరే స్యాతాం ద్వౌ మాసావధిమాసకౌ। పూర్వమాసస్తు సంసర్పః పరస్త్వధికోభవేత్॥

(బార్హస్పత్యజ్యోతిషగ్రంథః)

క్షయకార్తికాదిత్రయే నాన్యతః స్యాత్తదా వర్షమధ్యేధిమాస ద్వయంచ

క్షయమాసం కార్తీక, మార్గశీర్ష, పుష్య మాసాల్లోనే ఏదో ఒక మాసంలోనే వస్తుంది.ఇతరమాసాల్లో రాదు.

క్షయమాసం వచ్చిన నెలకు ముందు మాసాల్లో ఒకటి, తరువాతి మాసాల్లో ఒకటి ఇలా రెండు అధికమాసాలు

వస్తాయి.క్షయమాసం 141, 122, 19, 103 సంవత్సరాల భేదంతో వస్తుంది.క్షయమాసం వచ్చినప్పుడు

ఆమాసానికి ముందు మాసాలలో ఒకటి మరియు తరువాతి మాసాలలో ఒకటి ఇలా రెండు అధికమాసాలు

వస్తాయి.ముందు వచ్చే అధిక మాసాన్ని సంసర్ప మాసమనీ తరువాత వచ్చే అధికమాసాన్ని

అధికమాసమనే అంటారు. క్షయమాసాన్ని అంహస్పతి మాసం అని కూడా పిలుస్తారు.

## అధిక మాసం - పౌరాణిక దృక్పథం

అధికమాసం పౌరాణికంగా అధిక ప్రాధాన్యత కలిగియున్నది.అధికమాసం వ్రతం చేసే వారికి ఈ వ్రతం వల్ల

వారి పాపాలన్నీ క్షయమౌతాయని హేమాద్రిచే చెప్పబడినది.

శ్లో॥ అధికమాసస్యదేవోహంపురుషోత్తమసంజ్ఞకః। స్నానం దానం జపో హోమం స్వాధ్యాయం

పితృతర్పణం॥

దేవార్చనమథాన్యచ్చయేకుర్వంతి మనుష్యజాః। అక్షయం తద్భవేత్సర్వం మమోద్దేశేన యత్కృతం॥

మలమాసో గతః శూన్యో యేషాందేవి ప్రమాదతః । దారిద్రంపుత్రశోకంచ పాపఙ్కవిగర్హితమ్॥

మర్త్యేలోకే భవేజ్జన్మ తేషాందేవి నసంశయః॥ (వ్రతరాజ్)

ఓ లక్ష్మీ! పురుషోత్తమమాసం అని పిలిచే ఈ అధికమాసానికి అధిదేవతను నేనే. నన్ను ఉద్దేశించి స్నానం,

దానం, జపం,హోమం, స్వాధ్యాయం మరియు పితృతర్పణం ఇత్యాదులు చేసే వారికి ఫలం

అక్షయ్యమౌతుంది.ఇవి చేయని వారు తిరిగి మనుష్యలోకంలో జన్మించి పాపాలు చేస్తూ మళ్ళీ మళ్ళీ

నిస్సందేహంగా దారిద్రం, పుత్రశోకం ఇత్యాదులతో బాధపడుతుంటారని శ్రీమహావిష్ణువు చెప్పినట్లుగా వ్రతరాజ్

అనే గ్రంథంలో చెప్పారు.

శ్లో॥ అసంక్రాంతవ్రతం నారీ యాకరోతి మమ ప్రియే। దారిద్రంపుత్రశోకంచ వైధవ్యంనలభేచ్చసా॥

పురుషోప్యేవంవిధోదేవి యదికుర్యాన్మలిమ్లుచం॥

మలిమ్లుచం ప్రాప్య నపూజితోయైః శ్రీనాథదేవః పరయేహభక్త్యా।

తేషాంకథంస్యాత్తు సుఖంచ సంపత్ పుత్రః సుహృత్స్వజనశ్చాపిభార్యా॥

(భవిష్యోత్తరపురాణం)

సంక్రాంతి రహితమైన మలమాసంలో నన్ను పూజించే స్త్రీలకు దారిద్రం, పుత్రశోకం మరియు వైధవ్యం

లభించదు.అలాగే ఈ మాసంలో నన్ను పూజించే పురుషులకు కూడా దారిద్రం, పుత్రశోకం మరియు

భార్యావియోగం ఉండదు.మలమాసంలో నన్ను పూజించని వారికి సుఖము, సంపద, పుత్రులు, స్వజనులు

మంచి భార్య ఎలా లభిస్తారని లక్ష్మీదేవితో పలికినట్లుగా శ్రీమహావిష్ణువు పలికినట్లుగా భవిష్యోత్తరపురాణంలోనూ

ఉన్నది.

పద్మపురాణంలో పురుషోత్తమ మాహాత్మ్యం గురించి ౩౪ అధ్యాయాలలో

చెప్పబడినది.ఇందులో

మహావిష్ణువును ఏ ఏ విధంగా పూజించి వారి జీవితం సుఖమయం చేసుకుని చివరికి ముక్తిని పొందారో

వివరించారు.ఇందులో కృతస్యకర్మణోమహిమావర్ణనం అనే పేరుతో 18 వ అధ్యాయమున్నది.

శ్లో॥యద్యశ్నాతినరోనిత్యంగృహేహ్యన్యస్యబ్రాహ్మణః।
అన్నప్రస్థముపాదాయంకుంభేనిత్యంప్రపూజయేత్॥

యావన్మమదినంవిప్రద్వాదశ్యామర్చయేద్ధరిమ్।
కలశందక్షిణాంతస్మైభక్త్యాదద్యాత్సమాహితః॥

తత్కర్తాచజనఃకశ్చిన్నాన్యపీడామవాప్నుయాత్। నకదాచిద్భవేద్దుఃఖీసంకటంనాభిపద్యతే॥

నకశ్చిన్నరకంపశ్యేన్నాపిజాఠరవేదనామ్। సదాభోగీసదాదాతనకదాచిదృణీభవేత్॥

శ్లో॥దానానిపితృకార్యాణిసారాణిక్రతవోమలాః।దుర్లభంమానుషంజన్మభూఖండేభారతేశుభే॥

యేషాంసర్వోత్తమోమాసఃస్నానదానజపైర్గతః। సర్వసాధనభూయిష్ఠోవైష్ణవః పురుషోత్తమః॥

అని శ్రీమహావిష్ణువు ప్రీత్యర్థం బ్రాహ్మణుని ఎలా పూజించాలి, అలా పూజిస్తే ఏ ఫలితం కలుగుతుంది, ఈ

విషయాలన్నీ ఈ అధ్యాయంలో వివరించారు.

శ్లో॥యథావిష్ణుంతథావిప్రాన్పూజయేద్భక్తిమాన్నరః।
విప్రేనారాయణేభేదంకుర్వన్నాప్నోతికిల్బిషమ్॥

విష్ణుంసంపూజయన్భక్త్యాబ్రహ్మద్వేషంసమాచరేత్। మహావ్రతంకృతంతస్యసర్వంభవతి నిష్ఫలమ్॥

అని బ్రహ్మద్వేషులకు చురక అంటించారు

అధికమాసానికి పురుషోత్తమమాసమనే పేరు రావడానికి పురాణాలలో వివరించిన ఒక కారణం

చెబుతారు. చైత్రాది మాసాలన్నిటికీ మాసానికి ఒక అధిదేవత ఉన్నాడు.కాని అధికమాసానికి అధిదేవత

లేకపోవడంతో అధికమాసం కలతచెంది, శ్రీమహావిష్ణువును ప్రార్థించగా అధికమాసానికి తనే అధిదేవతగా

ఉంటానని అభయమిచ్చినట్లు అప్పటినుంచి అధికమాసం పురుషోత్తమమాసంగా పిలువబడుతున్నట్లు

చెప్పబడుతున్నది.

శ్లో॥స్నానందానంతపోహోమః స్వాధ్యాయఃపితృతర్పణమ్।

ఉపోషణంనిత్యదానంనియమాదిసురార్చనమ్॥

అని అధికమాస కర్తవ్యాలను పురుషోత్తమమాస మాహాత్మ్యం ద్వారా తెలియజేశారు.

1.వేకువజాముననే మేల్కొని నదీ స్నానం కానీ చన్నీళ్ళ స్నానం  చేయాలి.

2.స్నానానంతరం క్రింది శ్లోకంతో శ్రీమహావిష్ణువును ప్రార్థించాలి

శ్లో॥గోవర్ధనధరంవందేగోపాలంగోపరూపిణమ్।గోకులోత్సవమీశానంగోవిందంగోపికాప్రియమ్॥

భక్తిర్భవతిగోవిందేపుత్రపౌత్రవివర్ధినీ। అకీర్తిక్షయమాప్నోతిసత్కీర్తిర్వర్ధతేచిరమ్॥

3 రోజూ ఒకే పూట భోజనం చేయాలి.భోజనకాలంలో మౌనంగా ఉండాలి.

4.నిత్యం దేవుని వద్ద నేతిదీపం వెలిగించి మాసానంతరం బ్రాహ్మణునికి ఇవ్వాలి.

5.ఈ మాసంలో మనకి అత్యంత ప్రీతికరమైన వస్తువును త్యజించాలి.

6.దానధర్మాలు విరివిగా ఆచరించాలి.

7.నిత్యం గోపూజ చేయాలి దానికి దాణా అందించాలి.

8.నిత్యం దేవతార్చన చేయాలి.ఎల్లవేళలా భగవంతుని స్మరించాలి.

9.హైందవసంస్కృతిలో అల్లుడిని మహావిష్ణువు అంశగా భావిస్తారు.అందుకే వివాహాలలో కాళ్ళుకడిగి

కన్యాదానం చేసే సందర్భంలో వరుడిని మహావిష్ణుస్వరూపాయ అని సంబోధిస్తుంటారు.

ఈ కారణంవల్లే అధికమాసంలో శ్రీమహావిష్ణువు ప్రీత్యర్థం కూతురిని అల్లుడిని సాదరంగా తమ ఇంటికి

ఆహ్వానించి వారికి త్రయస్త్రింశతి (33) దేవతాత్మకంగా 33 అపూపాలను, యథాశక్తిగా దక్షిణతోపాటు వస్త్రాలను

మరియు ఘృతదీపదానం చేయాలి.

త్రయస్త్రింశతి దేవతలంటే ద్వాదశాదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు మరియు అశ్వినీ దేవతలు.

అధికమాసాన్ని మహారాష్ట్రులు అత్యంత భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తారు.మాసం పాటు ప్రతిదినం పుణ్యస్నానాలు,

తర్పణాలు, దేవపూజ, బ్రాహ్మణులకు దానాలు ఇత్యాదులు చేస్తుంటారు.

శ్రీసంత్ గోపీనాథ్ అనే పరమభక్తుడు (30) అధ్యాయాలలో మహారాష్ట్రభాషలో రచించిన

పురుషోత్తమమాసమహాత్మ్యంలోని అధ్యాయాలు రోజుకొకటి చొప్పున చదువుతారు.దేవాలయాల్లో కూడా

పురుషోత్తమమాహాత్మ్యం ప్రవచనం నిత్యం చేస్తుంటారు.ఆసక్తి ఉన్నవారు తమ ఇళ్ళల్లో కూడా చదివి తమ భక్తి

తత్పరతను చాటుకుంటారు.

అధికమాసంలో గృహారంభ, గృహప్రవేశాలు, ఉపనయన, వివాహాలు, తీర్థయాత్రలు, దేవ ప్రతిష్ఠలు ఇంకా

ఏవైనా ముఖ్యమైన శుభకార్యాలు వర్జ్యము.

*****